# శ్రీ మహమ్మద్ రసూల్ వారి చరిత్ర

"బ్రహ్మర్షి" డా॥ ఉమర్ ఆలీషా కవి కృతసంహిత

శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

పిఠాపురం - 533 450.

తూర్పు గోదావరి జిల్లా

# శ్రీ మహమ్మద్ రసూల్ వారి చరిత్ర

(ప ద్య కా వ్య ము)



"బ్రహ్మర్షి" డా॥ ఉమర్ ఆలీషా కవి కృతసంహిత




శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

పి ఠా పు ర ము - **533 450.**

తూ॥ గో॥ జిల్లా




[మూల్యము : రు. **75-00**

# పీఠాధిపతుల చరిత్ర

శ్రీ విశ్వవిజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠమునకు పీఠాధిపతులలో ఆది పీఠాధిపతి 1472 సం॥లో భారతదేశమునకు వచ్చియున్నారు.

ఆదిలో ఈ పీఠము అరబ్బుదేశమున అందలి బాగ్దాదునుండి పారశీకదేశము, అక్కడనుండి భారతదేశమునకువచ్చి ఢిల్లీనగరమున నివసించి అక్కడ సర్మద్‌హుస్సేనీ (సర్మద్ షహీద్) పేరుగల తత్త్వవేత్తను ఔరంగజేబు చంపించినప్పుడు వారి సమకాలికుడైన యీ పీఠాధిపతి తానేషా కాలమున హైదరాబాదు వచ్చి హైదరాబాదు నుండి యీ పీఠమునకు జాగీరొసంగిన కారణమున ఆంధ్రదేశము ప్రవేశించి పీఠికాపురమున నివాసముగా స్థిరపరచుకొన్న మొదటి పీఠాధిపతి మదీనె కబీర్షా.

ఆ కాలమువారిచే యీ పీఠాధిపతి మదీనా నుండి వచ్చిన తత్త్వవేత్త యని పిలువబడినారు. ఈ పీఠాధిపతులు ఏ దేశములోనున్నప్పుడు ఆ దేశ భాషలలో, ఉత్కృష్టమైనదిన్ని గణనీయమైనదిన్ని అయిన కవిత్వం చెప్పియున్నారు.

వీరు అరబ్బి, పార్సీక భాషలలో తత్వముగూర్చి గ్రంథము వ్రాసినట్లు తెలియబడుచున్నది.

ఈ మదీన్ కబీర్షాగారిని తత్వరూపులుగ గ్రహించుటకు ఆనాటి ప్రజలు వీరి మహత్మ్యము చూడగోరి బండ్లకొలది యిద్ధనంబులు కాల్చి అగ్నిగుండము యేర్పరచి వారిని అందు కూర్చుండమని కోరగా అప్పుడు ఆ అగ్నిగుండమున పూలపాన్పున గూర్చునట్లు గూర్చుండి తన మానసిక మహత్మ్యము ప్రజలకు జూపిరని వారి చరిత్ర.

వారి తరువాత వారి అగ్రనందనుడు ద్వితీయ పీఠాధిపతి మధార్షా, ఆ తరువాత వారి సుతులు తృతీయ పీఠాధిపతి "హసన్మియాషా వారి కుమారులు చతుర్థ పీఠాధిపతి కహెనేషావలి". వీరి పిన్ననాటి కాలమున బాల్యమందే వీరి తండ్రి హసన్మియాషా దివంగతులైన కారణమున

వారికి తిరుగ అఖైలలీషా గురువర్యులచేత యీ పీఠతత్వ స్వరూపమైన మహామంత్రము ప్రిబోధింపబడి తిరుగ యీ పీఠము పునఃస్థాపితమైనది.

శ్రీకహనేషావలీగారి చిన్ననాడు ఒకనాడు వారి దృశ్యములో నొక మహాపురుషుడు కనబడి దర్శనమిచ్చి మీ వంశమందు ఆధ్యాత్మికరూపమైన తత్వస్వరూపము పీఠాధిపత్య రూపంలో వెలార్చుబడుచున్న విధానము మీకు ముందు మీ తండ్రిగారు పీఠాధిపతిగ నిర్వహించు కాలమున మీ బాల్యమునందే వారు నిర్వాణము పొందియుండుటచే, అది మృగ్యమౌ సమయము కలుగనున్నది. ఆ పీఠమునకు మీరు పీఠాధిపత్యాధికారము స్వీకరించవలసియున్నది. ఇప్పుడు నాచే మీకు యీ మహామంత్రిము ప్రబోధింపబడి పునరుద్ధరణ కావలసియున్నది. కాబట్టి ఈ రహస్యము నాచేత తెలుసుకోవలసినదిగా చెప్పినట్లు పై విషయములు దృశ్యములో చెప్పిన విధానమున శ్రీ కహెనేషావలీగారు బడికిపోవు సమయాన యే మహాపురుషుడు దృశ్యములో తనతో ప్రసంగించెనో అ మహావ్యక్తి జాగ్రదావస్థలో యెదుటపడి యే వాక్కులైతే దృశ్యములో ఆయన నోట ధ్వనింపబడినవో, నదేతీరున ఆయనచే ఈ పీఠాధిపతులచే ప్రబోధింపపడు మహామంత్రము అనాడు కహెనేషావలీగారికి ప్రబోధింపబడినది. ఆయనే శ్రీ అఖైలలీషా గురువులు. వీరు ఆకల్పాంతముదాక యీ పీఠాధిపతులకు గురువుగ సంస్మరణీయులు.

ఆనాటినుండి యీనాటివరకు యీ పీఠాధిపత్యము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వారి పీఠాధిపత్య కాలములో "కలిక భాగవతమనే" గ్రింధము ఈశ్వర పరిణామము తెలుపు మహాత్మ్యములతో నిండిన తత్వము చెప్పబడినది.

ఆ తరువాత వారి అగ్రనందనులైన పంచమ పీఠాధిపతి మహర్షి శ్రీ మొహియద్దీన్ బాద్షా గురువర్యులు. తన స్వానుభవైక వేద్యమైన కీర్తనలు, పదములు "పరతత్వ కీర్తనలు" అను గ్రంధముగ రచింపబడినది.





"బ్రహ్మర్షి" శ్రీ మొహియద్దీన్ బాద్షా

పంచమ పీఠాధిపతి

## మారుతి రాగము - ఆటతాళము

విను మహాశ్చర్య మిదియు వినిపింతు నకటా
తనువులో బ్రహ్మమట తా గాంచు టహాహా ॥విను॥ 1

జన్మ మెత్తితి గాని జీవునకు సుఖ మెఱుఁగ
సన్మాన మెవ్వరికి సేయ లే నైతిన్
తన్మయంబేదో యా తత్వ మేదొ తెలియ
దు న్మనియోగ మేలాగు సాధింతున్ ॥విను॥ 2

ధనధాన్యములు గూర్చి ధరగానకను తిరిగి
వినయ మేమియు లేక విఱ్ఱ వీగుచును
మనమునను తను గర్వమును నొంది మండిపడి
తనకన్న ఘనులెవ్వ రనుచు నే చచ్చున్ ॥విను॥ 3

అయ్యయో యీకాయ మంధకారము నొదిగి
శయ్య సుమములపండి సౌఖ్యమొందుచును
వెయ్యి మాయలు బన్ని కయ్యంబు లనుబెంచి
ప్రయ్యలై తుదియముని ద్వారంబు జేరున్ ॥విను॥ 4

భాగ్యవంతుల మంచు భగవద్గృహంబుల
యోగ్యమని గట్టింతు రదియేమె వారు
భాగ్యహీనుల బుధుల పట్టెడన్నంబిడ ర
యోగ్యులా పాషాణముల కిడెదరేమో ॥విను॥ 5

సోమమంతఃకరణ మందున్న దేయాత్మ
దేహియంచును శ్రుతుల శ్రితపర్చికొనుము
మోహరహితపదాన మొహియదీన్ భాష్య సం
దేహములు అఖైలలీ గురుడు మాన్పె ॥విను॥ 6

## పీల్వారాగము - ఆటతాళము

ఓంకారమే జీవమనుచు నమ్మి
నాకారమునను వీక్షించు
ఏకమౌను నీలో ఆకారమును జొంది
ఆకంటి నడుమ నీ
వఖిలామై నిలిచెదవు ॥ఓం॥ 1

ఓంకారమునకు నాదామునకు భేద
మున్నా దేమిటో తెలియ వలయు
ఓంకార మిహామగును నాదాము నీవగును
శంకలెంచక తనుతా సాధించిజూచితె ॥ఓం॥ 2

తొలిజన్మ పదము లన్నిటిని తలఁచి
తలఁచి నే జాలి నొందితిని
ఇలకొన్ని జన్మములు ఈ జన్మమున జరిపి
తెలివిలోపల తెలివై తే జాము కనుగొంటి ॥ఓం॥ 3

అది యానాది మర్మంబు తెలివి
సాధించి గనుట ధర్మంబు
బిందు బీజము నందు నీవై నిలిచి నాద
మందు లగ్నంబై యా నందాము నొందెదవు ॥ఓం॥ 4

నేనై నను జూచు చుంటిని ఆఖై
లలి గురు నచట గంటిని
జ్ఞానసమాధి మొహియదీన్ భాషా సం
ధాన ధ్యాన మిదియె తర్కించి చూచితె ॥ఓం॥ 5

బ్రహ్మర్షి శ్రీ మొహియుద్దీన్ బాద్షా
పంచమ పీఠాధిపతి.

—★—



"బ్రహ్మర్షి" శ్రీ డా॥ ఉమర్ ఆలీషా

షష్ఠమ పీఠాధిపతి

# శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి

## జీవిత సంగ్రహము

శ్రీ ఉమర్ ఆలీషా మహాకవిగారు పీఠికాపురమున క్రీ. శ. 1885వ సం॥లో జన్మించిరి. వీరి తండ్రిగారు మహర్షి మొహియద్దీన్ భాషా గురువర్యులు. వీరి జనని చాన్బియాంబ.

వీరి తండ్రిగారు అరబ్బీ, పారశీక, సంస్కృతాంధ్ర పండితులు. ఆధ్యాత్మిక విద్యాపీఠాచార్యులు, ఆత్మవిద్యాపారంగతులు. వీరి కుటుంబము పూర్వము నుండియు భాషాపాండిత్యమునకు, ఆధ్యాత్మిక విద్యాసంపత్తికిని ప్రఖ్యాతి గాంచినది. శ్రీ కవిగారు చిన్ననాడే సంస్కృతాంధ్రములు విశేషముగా నభ్యసించిరి. తదుపరి అరబ్బీ పారశీ కాంగ్లభాషలు నేర్చిరి. వీరు ఆంగ్లమున వ్రాయట, మాట్లాడుట యెఱుగుదురు; కాని ఆంగ్ల పద్య కావ్యములందు ఎంతమాత్రము వీరికి ప్రవేశములేదు. వీరు సహజ కవులు వీరి 14 వ వర్షమున తెనుగున ధారాళముగా కవిత్వముఁ జెప్పిరి. వీరి 18 వ యేట "మణిమాల" యను నాటకము వ్రాసి అచ్చొత్తించిరి. అది షేక్స్పియర్ మహాకవి నాటకమువలె నున్నదని అప్పటి పత్రికలు కొనియాడినవి. వీరి కనేకచోట్ల ఉద్యోగము లిచ్చెదమని ఆహ్వానించినను వాటి కంగీకరింపక భాషాసేవ దేశసేవఁ జేయుచు తమ జీవితమును గడిపిరి. వీరు 1934 వ సంవత్సరము డిశంబరు నెలలో అఖిల భారత శాసనసభకు సభ్యులైరి. ఆ పదవి వీరు అవతారము చాలించు వరకు నుండెను.

వీరికి International Academy of America వారు 1936 సంవత్సరమున Doctor of Literature బిరుద మొసగిరి. శ్రీ కవిగారు వంశపారంపర్యముగా వచ్చుచున్న ఆధ్యాత్మిక విద్యాపీఠమునకు ఆచార్యులై పదహారు వేల జనమును శిష్యులుగా నొనర్చిరి.

వీరి యౌగిక జ్ఞానమును కొనియాడుచు జ్ఞానసభాసభ్యులు వీరికి బ్రహ్మర్షి బిరుద మొసంగిరి. వీరి సతీమణి అగ్బరు బీబీగారు. వీరితో ఢిల్లీ నగరము వెళ్ళి ది. 5-4-35 తేదీని దివి నలంకరించిరి. ఆ దినమున ఢిల్లీ శాసన సభ మూయబడెను. వీరు గతించినప్పుడు వీరికి అయిదుగురు కుమారులు, యిరువురు కుమార్తెలు, పెక్కురు పౌత్రపౌత్రిక లుండిరి.

శ్రీ కవిగారి జీవిత చరిత్ర ప్రత్యేక పుస్తకముగా వ్రాయుబడు చున్నది. వీరు రచించిన సూఫీ వేదాంత గ్రంథమందు వీరి జీవితము సంగ్రహముగా నిట్లు వ్రాసిరి.

—. స్వీయము .—

క. ఆ మొహియద్దీన్ బాద్షా
నామ మహాయోగి కగ్రనందనుఁడను నా
నా మహితాగమ హిత వి
ద్యామతి "ఉమాౘ్రలిషా" మహాకవి నేనున్

సీ. రచియించినాఁడ విభ్రాజితదివ్య ప్ర
బంధముల్ పది కావ్య బంధములుగ
వ్రాసినాఁడను కల్పనాసక్త మతి పది
నాటకంబులను కర్నాటపక్కి
కూర్చినాఁడను కళాకోవిదుల్ కొనియాడ
నవలలు పది నవ నవల లనఁగ
తెలిగించినాఁడ నుద్దీపితాఖండ పా
రసి కావ్యములు పది రసికులలర

రసము పెంపార నవధానక్రమములందు
ఆశువులయందు పాటలయందు కవిత
చెప్పినాఁడ నుపన్యాస సీమలెక్కి
యవని "ఉమాౘ్రలిషాకవి" యనఁగ నేను.

ఉ. రాజుల జూచితిన్ సుకవిరాజుల నోర్చితి బేరుమోగ్రియరా
రాజులఁ నోలగంబుల విరాజితపండిత సత్కవీంద్ర వి
భ్రాజిత మౌలవీబిరుద పట్టములందితి యూనివర్సిటివ్
దేజముమీఱ సభ్యుడయితిన్ మతబోధకుఁడైతి గ్రిమ్మఱన్.

ఉ. వ్యాసములున్ విమర్శనలు భావకవిత్వరసైక చారు వి
న్యాసములున్ మతాంతరమహాపరివర్తన తత్త్వరూపకో
పాసనముల్ పురాణములు వ్రాసితి భారతభూమి నే నుప
న్యాసము లిచ్చుచున్ దిరిగినాఁడను "ఉమ్రిలిషా" కవీంద్రుఁడవ్.

ఉ. వేలురచించి విద్యలనుబెట్టి గడించితి పారితోషికా
ద్యాళిని వేయినూట పదియార్లను సింహతలాటముల్ మహా
భీలకసత్కళాకనక విశ్రుతముల్ జయభేరి మోగ్రియ హిం
తాల వసీనటత్కవి తండము లేమిటి లెక్కమాకడన్

సీ. సాధించితిని యోగసాధనంబులు హిమా
గమ మెక్కి మతిని చక్కాడియాడి;
బోధించితిని జ్ఞానసాధనక్రమములు
చెవినిల్లుగాఁ జేసి చెప్పిచెప్పి;
సవరించితిని పెద్దసారస్వతంబును
శబ్దశాస్త్రంబులు జదివిచదివి;
చూపించితిని రాజ్యలోపంబు లాంగ్ల ప్ర
భుత్వంబు ముంగర మోపిమోపి

తే. ఇప్పుడప్పుడె నలుబదియేండ్లపైన
దాఁటిపోయెను వయసు నీనాఁటికైన
శాంతి గలుగదు నీ కళాధ్వాంతమందు
జీవితము తెన్ను సుడిబోవు నావబోలు.

శా. నాలోనున్నవి నేనుజూచినవి విన్నాణంబులై లోకమం
దాలోకింపఁగ రాని యీ యమరవిద్యాతత్త్వమర్మంబు లం
దేలోటున్ జనియింప దీశ్వర రహస్యైకైక మీమార్గ మే
మేలా దాచెదమంచుఁ జెప్పితిమి మీరిద్ధాత్ములై తేరఁగన్.

కం. మా తాతయు మా తండ్రియు
ఖ్యాతిని అఖైలలీ మహాగురువర వి
ద్యాతత్త్వము నేర్చిరి త
ద్రీతుల వివరింతు యోగరీతులు తెలియున్.

ఉ. ఎల్లరు జెప్పుచుండిరల యీశ్వరుడీవని మీరుగూడ నా
కల్లలు బొల్లులల్లి కథగా నిటుకల్పనఁజేసి చెప్పగా
నొల్లునెయంచు మీరలన నోపుదురేమొ తదీయవాస్తవం
బల్ల రహస్యమున్ దెలిసి యద్భుతమార్గము విప్పిపెట్టితిన్.

మ. కనదుల్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబుగావించున
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్రి
హ్మనుగామార్చెడు ద్రోవజూపితి నిధి ధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరిసంకాశంబు సంధిల్లెడున్.

ఉ. మేమురచించు గీతములు మృత్యువాయువు పదంబులందులో
నేమియు నర్థహానికెడమియ్యక ఉన్నది యున్నట్లుగా
నేమహనీయుడున్ నడచి యీశ్వరరూపమెఱుంగ నేర్చునో
ఆ మహితాత్ముడొక్కఁడె యథార్థ మెఱింగి మృతిన్ జయించెడున్

శా. నాతోనున్న మహాకవీశ్వరుల నానాకావ్యముల్ వ్రాసినెం
తౌతత్త్వాత్మక దృక్ప్రపంచకము నుద్యోగించి చిత్రించుచున్
చైతన్యంబు గలుగంగజేసితి మహాసత్యస్వరూపంబుతోఁ
జేతోవీధిని నీశ్వరుంగనెడు వైచిత్ర్యంబు జూపించితిన్.

ఉ. ఎవ్వరి నొవ్వనాడమిటు లెవ్వరినోరును కట్టివేయమే
ఘెవ్వరిదారి దూరిమరలింపము మాకడవచ్చు వారితో
నివ్వటిలంగ నీ తెలివునేర్పి తరించుమటంచు చెప్పి మా
దివ్వెవెలుంగ జేసెదము దివ్యులుగన్పడ బుద్ధిమార్గిన్పడన్.

## —• అగ్బరాంబ •—

శా. ఆ ఢిల్లీనగరాంగ్ల శాసన సభాభ్యర్థిత్వ మర్థింపుఁ డం
చాడన్ నేను కృతార్థుఁడై జనిన నాకై వచ్చి ప్రాణంబులున్
వీడెన్ నాసతి అగ్బరాంబిక చలత్ విద్యుల్లతన్ బోలె; యీ
నాఁడే నశ్రలు "గోరి" పై విడుచుచు న్వర్త్రింతు నిర్జీవినై.

ఉ. ఏను రచించినట్టి కృతు లెన్నిఁటినో వినె తల్లి; తండ్రి నా
నా నవనాటక ప్రకరణంబులు నాఁడగ జూచినారు; ఢి
ల్లీ నగరాంగ్లభారతమహీధవ శాసనసభ్య సత్పదం
బానఁగ గాంచి "అగ్బ" రమరాలయ మేగె వెలుంగుచుక్కయై.

శా. ఎన్నోబాధలు బొందుచుండు మని న న్నీభూమివర్జించి యా
పున్నెపుంగని అగ్బరేఁగె దివికిన్ బూర్ణేందు బింబంబు వా
ర్థి న్నిద్రింపంగ బోయినట్లీఁక మహాంధీభూత మాలిన్యం సం
ఛన్నాస్మన్నివిషిద్ధజీవిత మభావం బెన్నినాళ్ళుండినన్.

సీ. ఏమాట చెప్పిన నెదురాఁడగా లేదు
పరమ సాధ్వీత్వంబు వరలుకతన
ప్రాణాల నర్పించి పరిచర్యలను జేసె
పరమహర్షంబు ముందరను నిలువ
కలిమిలేములను నొక్కటిగాఁగ గణియించె
నిత్యకళ్యాణంబు నెలకొనంగ
ఏవురు కొడుకుల నిద్దరు కూఁతుల
ననిశంబు దీవించు నాత్మకాంతి.

తే. ప్రతిదినంబు చదువు ఖురాన్ను మాజు
శౌచశీలాన నలువది వత్సరములు
ధరణి జీవించి స్వర్గాన కరిగె అగ్బ
రాంబ దివిజులు నీరాజనంబులిడఁగ.

చం. పరమపవిత్రి యీ వెలది పండితురాలు నితాంత సత్యసం
భరిత రసాత్మక ప్రకృతి వడ్డికి బారెడు ప్రేమమూర్తి సుం
దర సముపాసితం బయిన ధర్మపదంబును సంతరించి యీ
శ్వరునెద నగ్బరాంబ కడు ప్రార్థన సేయుచు నెల్లవేళలన్.

శా. పల్లెన్ బుట్టిన ఢిల్లిలో బ్రిటిషుసామ్రాజ్యంబు పాలించు వా
రెల్లన్ వచ్చి సమాధిజేసిరి భవన్మృత్యున్ విచారించి యో
పుల్లాబ్జానన "అగ్బరాంబిక" భవత్పుణ్యంబు దేశాల రా
జిల్లున్ విచ్చిన కుందఁబోలె వెస నే జీరాడుచున్నా నిటన్.

చం. హృదయము ముక్కలౌనటుల నేడ్చుచుఁ గన్నులనీరు కాల్వలై
చెదరఁగ నిన్నులోకములఁ జేరుటకంటె సమాధితోంటి నీ
సదనము జేరుమార్గము విచారణజేయుట లెస్స యైహి కా
స్పద విభవానుషంగభవబంధమువాసిన నిన్ను చూడఁగన్.

శ్రీ కవిగారు యిస్లాం మతస్థులు. వీరి మాతృభాష ఉర్దూ. ఆంధ్ర భాష మాతృభాషగా కానివారు తెనుఁగున సరస కవిత్వముఁ జెప్పినవారు ఈ కవిగారొక్కరే. వీరు రచించిన మహాభారత కౌరవరంగ మను నాటకమున....

"నాటకముల్ ప్రబంధము లనంతముగా రచించిన వాణి కా
వ్యాటవి భావవీథుల విహార మొనర్చ జయధ్వజంబు వా
గ్వాటిని నిల్పినట్టి జనవిశ్రుతు ఉం రలీషా కవీంద్రుడన్—"

అని వ్రాసిరి.

శ్రీ ఉమర్ ఆలీషా మహాకవి ఈ తత్వ కీర్తనలందు కూడ అనేక గంభీర భావముల నొసంగిరి.

"చంద్రుడెవరు చుక్కలెవరు
ఇంద్రుడెవరు ఈశుఁడెవరు
ఇంద్రియంబులు కట్టిచూచితె
యిన్నితానై యుండలేద"

.... .... ....

"రాయినైతే రప్పనైతే
కాయనైతే కసరునైతే
ఏ యుపాయముచేతనో నే
నా యనంతుని బట్టియుందు"

మున్నగు పెక్కు ఋషివాక్యము లీ కీర్తనలందు చెప్పిరి. వీరురచియించిన "సూఫీవేదాంత" గ్రంథములో

మ. "కనదుత్ పాదరసంబు తాత్త్వికుడు బంగారంబు గావించు న
ట్లనుమానాస్పదమై వినాశకరమై యల్లాడు జీవుండు బ్రి
హ్మనుగా మార్చెడు త్రోవఁజూపితి నిదిధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు శూన్యమందు హరి సంకాశంబు సంధిల్లెడున్"

అని చెప్పిరి.

బ్రహ్మఋషిసత్తములైన శ్రీ ఉమర్ ఆలీషా మహాకవిజీవితమును చరిచి అనేక తత్వగ్రంథములను వ్రాసి అజ్ఞానాంధకారమున నల్లాడు జీవుని బ్రహ్మనుగా మార్చెడు త్రోవజూపిరి.

వీరు రచించిన గ్రంథము లేబదివరకున్నవి. శ్రీ కవిగారు తమ శిష్యులకు దర్శన మిచ్చుటకై నరసాపురము (పశ్చిమ గోదావరి జిల్లా) వెళ్ళి అచ్చట ది. 23 జనవరి 1945వ నాటి సాయంత్రము 5గంటలకు దివి నలంకరించిరి. వీరి భౌతిక దేహమును పిఠాపురముఁ దెచ్చి 24 వ తేదీ సాయంత్రము రైలుస్టేషను వద్దనున్న వారి యారామములో సమాధి చేసిరి.



బ్రహ్మర్షి శ్రీ హుస్సేన్ షా

సప్తమ పీఠాధిపతి

శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము

# పరంజ్యోతి

పడినకష్టాల పాటవంబలతిగాక!
సడలిపోయిన సౌఖ్యాలు స్మరణరాగ
మాసిపోయిన మాటలు మరపురాక
పాటపాడిన పదములు పలుకలేక
వెడలిపోయిన కాలంబు వెదకుచుంటి
వెతుకుచుంటి నామరుగునే వెదకుచుంటి
తెలుసుకొంటి నామరుగునే తెలుసుకొంటి
తిరిగి కాలంబురాదని తెలుసుకొంటి (జన్మ)
లేదు పరతంత్రమికనాడు లేనేలేదు
లేదు నాయన్న మౌఢ్యంబు లేనేలేదు
స్వార్థమున నీ ప్రకృతి నాకు స్వస్తి జెప్ప
భ్రాంతిలోగన్న విషయ విభ్రాంతిగాగ
పోవుచుంటి నాదారినే పోవుచుంటి
కాననంబులో పురములో కానరాని
ఆ అయోమయ మధ్వాన్నమైనదారి
ఆ ప్రళయకాల దంధయ్యమైన యట్టి
చిమ్మచీకట్ల చెంగట చేరిచేం
జరిగిపోయె నహస్సులు జగములోన
దాటిపోయెను మిన్నులా దారిలోన
స్వర్గ నరకాల వీధులాశ్చర్యముగను
దారులివ్వగ వాటిని దాటి నిలిచి
చూచినా నది నిజముగ శూన్యజగము
కలతబడి మనో దుఃఖాన గలయజూడ
అంతదూరాన నేదియో నవతరించె
అందులో రూపమేదొ నాకానుచుండె
అందు బ్రహ్మాండములును రూపొందుచుండె
ఎవరిదారూపు నాకపుడెరుక బడియె
అదియె నా గురుని స్వరూపమవధిగాను
అతడె అఖై లలీషుడు అది నిజంబు
అదియె ప్రేమైక రసరూపమవ్యయంబు
వెలువడెను గాదెనందుండి వెలుగదేదొ

నిండెనా వెల్గు జగముల నిండె నిజము
నిండె నావెల్గు నాలోన నిండె నిజము
నిండి నాలోన జతనాన నుండిపోవ
నిలిచె సంతృప్తి నాలోన నిలిచిపోవ
ఇమిడె ప్రమదంబు నాలోన నిమిడిపోవ
తెలిసె జగములు "నేన" ని తెలిసిపోయె
నేనె "విశ్వంబు" విశ్వంబు నేనె నిజము
నిజము యీ దృశ్యమంతయు "నేనె" నిజము
గగనములలోన నారూపె గానుపించె
భాస్కరునియందు నారూపె బరగుచుండె
సలిలమందున నారూపె సాగుచుండె
ఈ వసుంధర నారూపె యసగుచుండె
అరయ వాయువులో నిండినదిగా దోచె
అదిగో వైశ్వానరుని నిండెనదిగా చూడు
ఎన్ని చెప్పుదు సర్వంబు "నేను" గాను
సృష్టినంతయు నాలోనె చూచినాడ
ఇదే పరంజ్యోతియన నొప్పు నీ వెలుంగు
ఇదియె యోగులుగన్నట్టి జ్యోతిసుమ్మి
నిలిచిపోదు నీ జ్యోతి నేనెప్పటికిని
నిలిచిపోయి నీ జ్యోతి నేనెప్పటికిని
రాను మిముజూడ వాంఛనే రాను రాను
తిరిగి వచ్చెడి నాశను తీరిపోయె
వెడలి వచ్చిన మాటలు వేరు లేవు
లీనమగుదు నీ జ్యోతిని నేనుగానె!
మరచిపొందింక నారాక మఱచిపొందు
వదలివేయుడు దర్భలు వదలునట్లు
విడచివేయుడు ధారను విడుచునట్లు
ఇట్లు "హంస్సేన్ షా" కవి ఎరుక జెప్పె!

బ్రహ్మర్షి శ్రీ హంస్సేన్షా
సప్తమ పీఠాధిపతి



"బ్రహ్మర్షి" శ్రీ మొహియద్దీన్ బాద్షా

అష్టమ పీఠాధిపతి

తే. గీ. ధర్మమననేమి యో దెల్పి ధరణికెగసి
అమృతకరులై బోధకాధ్యాపకులుగ
నుండి పీఠికాపురమందు నోలగముల
ప్రభువులై యుండి రా"షా" వంశభవులు.

2) ఉ. అన్నిటికన్న గొప్పమహిమాస్పదమైన మహత్త్వమందు. నిం
దున్నది ఆ "షాతత్వ" మనె నుత్తమగ్రంధము దైవదత్తమై
సన్నుతమై పవిత్రమయి శాసనమై సచరాచరంబులో
నున్న రహస్యముల్ దెలుపుచున్నది యీశ్వరవాణిసృష్టికిన్.

3) తే. గీ. ఇట్టివిజ్ఞానమతిము నర్థించి ప్రేమ
పాఠములునేర్పి విజ్ఞానశక్తి గూర్చి
మానవోద్ధార కుండన మహిని వెలసి
మలినములుమాపె "హుస్సేన్‌షా" మౌనివరుడు.

4) తే. గీ. ఏదొ వేవెల్గు షాతత్వ నేగుదెంచి
అందులోన హుస్సేనుషా కృతవతరించి
వచ్చినిలిచె తేజంబుగ వసుధయందు
దెచ్చితిని నీకిదేయని తేటపరచె.

5) తే. గీ. వేలు లక్షలు శిష్యులు పాలుగూడి
ప్రజ, లజ్ఞానతిమిరంబు వారదోలి
భద్రమార్గమే కేశ్వరోపాసనంబు
వనుచు చాటిరి హృదయభక్త్యానుభూతి.

పంచరత్నములు సమాప్తము.

బ్రహ్మర్షి శ్రీ మొహియుద్దీన్ బాద్షా
అష్టమ పీఠాధిపతి





**శ్రీ డా॥ ఉమర్ ఆలీషా**

ప్రస్తుత నవమ పీఠాధిపతి

# పద్యమాల

సీ. సుందరంబుగనుండు సుడులతో గోదారి
చిరుగాలి కెరటాల పరుగులిడుచు
ఆణిముత్యాలట్టు అమరెడు బిందువుల్
మువ్వలరవళితో ముదముగొలుప
సప్తస్వరాలతో సంచరించెడి గాలి
కలహంసముని వీణ గతులబోలి
ఉరకలనురుగుతో ఉవ్వెత్తుగను పొంగి
పొరలు గంగానది పోల్కిదనరి

తే. గీ. కవి మనోహర హృదయంపు కందుకంబు
నవరసమ్ములతోగూడి నాట్యమాడి
కవితసాహిత్య వీధుల గదలిపోవ
గాన మొనరించి విహరించు గగనవీధి

కం. రవి అరుణ కాంతులతో
రవికృంగిన వేళరణము ముగిసినరీతిన్
రవిబోలు వీరవర్యులు
రవి తీరునపగ్రిబలు చుండ్రి రణవిఖ్యాతిన్

తే. గీ. అస్త్రములు చాచి కంఠస్వ రంబు చీల్చి
కటిక చీకటి దాటించి కాంతి జూపి
కంటి కన్నీరు కారంగ కానబడక
కామమోహంబు సడలించి కాచుగురుడు

సీ. నల్లకాకుల గుంపు మలినంబు మాయింప
కాసారమున వడల్ కడుగురీతి
ఆశాహివలయాల ఆకర్షణము నుండి
విషయవాసనలను విడువలేక

షడ్ వర్గములనుండి సంచరించుచునుండి
ముక్తి మార్గముగాంచ మూర్ఖుడగుచు
కాషాయ వస్త్రముల్ ఘనముగా ధరియించి
కొంగజపముచేసి కొలనుమున్గ

తే. గీ. కాని తనలోని కామంబు కడుగలేక
బాల్యయౌవ్వన కౌమార బలము తగ్గి
వార్థికమువచ్చి వడవడ వడకిచచ్చు
వెఱ్ఱి జనులనుచూచినే వెఱగుపడుదు

కం. సిరిసంపద గలిగినచో
శిరమున మొలువగను కన్ను సిరిపతిననుచున్
శిరమున జేరనుగన్నులు
సిరినీయము దానమెపుడు చిరయశకీర్తిన్

సీ. అలలచే సెలయేఱు జలజల ప్రవహించ
సురులకు సంగీత శోభగూర్చ
రాక్షసులకేవేళ రణభీతిఁ గొలుపుచు
కర్కశధ్వనులతో కానుపించ
మృగజాతులకుఁ నెంతొ మోదంబు చేకూర్చి
మరమరధ్వనులతో మమత గొలుప
మనుజుని తమిదీర్చి మాధుర్యముగనుండి
కవితా ప్రసవంతుల కానుపించ

తే. గీ. భావములఁ బట్టి జీవుల భ్రాంతిఁగొలిపి
యండమావుల జలమట్లు ఎఱుకబడక
రాగ అనురాగభయ కోపత్యాగములతో
పరుగుపెట్టించు సద్గురుఁడు భయముతోడ

సీ. నక్షత్రములపూలు నభమున పూయంగ
చంద్రుండు ఉదయించె చెలులతోఁ
సుస్వాగతముపల్కి చుక్కల వెలువెల్ల
చిరునవ్వుతో చంద్రుచెంతచేర
మేఘమాలలదాగి మెఱయుచు చంద్రుండు
తారకల కవ్వించి తరలుచుండ
అందాల మేఘంబు ఆ చందురుని చూచి
ఆటలాడుచునుండె నద్భుతముగ

తే గీ. రేయి గడచెను రేరాజు చేయివిడచి
కడలిలో నుండి ఉదయించె కాంతితోడ
సూర్యదీపంబు పుడమిని చూచుచుండి
చంద్రుకంటెను తను గొప్పచాటిచెప్పె.

సీ. శశిరంబు ఏతెంచ చెలువలు విడనాడి
మొక్కలాకులురాల మోడుబార
శ్రావణమేఘాల సలిల దారల దడసి
చిగురుటాకులతోడ చెలగుచుండి
రోజాపూపొదల్ రాజితంబుగ పూచి
పరిమళంబులతోడ పరిఢవిల్లు
చందాన జీవుండు జడజన్మలో ఁ గ్రుగ్గి
చచ్చిపుట్టుచునుండ సద్గురుండు

తే. గీ. అవతరించుచునున్నాడు అవనియందు
మహిని మానవధర్మముల్ మలచి చెప్పి
సహజ యీశ్వర తేజంబు చాటి చూపి
జన్మతరియింప సన్మంత్ర జపము నేర్పు.

సీ. గగన మండలములో ఘనముగా విహరించి
మెఱుపు శబ్ధములతోడ మేళవించి
గలగలయను పాఱు గంగాజలము రీతి
ఘలుఘలు గజ్జల గతినిఁబోలి
శ్రోతల శ్రవణాలు శోభగా శ్రవణించ
సంగీత సాహిత్య సరళిదోప
ఆకాశ వీధిలో అందముగఁ నుదయించి
సహజ సౌందర్యంబు చాటిచెప్పి.

తే. గీ. కరణ తపయాగ యోగంబు దనర
కంటి కన్నీరు ఆనందకడలిఁ గాగ
కనక కమల కలిమి కల కళ ఫలింప
కనక మకుటంబు తలదాల్చె కావ్యకాంత.

సీ. మేఘాలగర్జనో మేఱువుగర్జనో
పరిమళంబులతోడ బయలువెడలె
విశ్వరహస్యంబు విజ్ఞాన మార్గంబు
వీరవర్యులకెల్ల విశదపరచి
కాంచన మకుటంబు కాంతుల బోలుచు
అజ్ఞాన జనులకు జ్ఞానమొసగ
ప్రతాపమువ్ చూపి భయము కల్గించుచు
శాంతంబు చూపెట్టె సహనసరళి

తే. గీ. ఇనుడు భయపడి నీ గొప్పతనముఁజూపి
సహజ కాంతిని ప్రసరింపగానలేక
నారికేళ ఫలంబునీరు బోలి
దుఃఖమును దాచిశాంతుడై వైదొలగుచుండె.

డా॥ ఉమర్ ఆలీషా,
B. H. M. S., M. D. [A. M.]
నవమ పీఠాధిపతి





శ్రీ కలిదిండి రామకృష్ణంరాజుగారు, వారి ధర్మపత్ని సీతాదేవిగారు



శ్రీ పెనుమెత్స సుబ్బరాజుగారు శ్రీ సూరయ్యమ్మగార్ల కుమార్తె శ్రీ కలిదిండి సీతాదేవిగారు. వీరు శ్రీ కలిదిండి రామకృష్ణంరాజు గారి ధర్మపత్ని. **[illegible] కొండమూరు ప॥ గో॥ జిల్లా.**

శ్రీ సీతాదేవిగారి తల్లిగారైన శ్రీ పెనుమెత్స సూరయ్యమ్మగారు పంచమ పీఠాధిపతి శ్రీ మొహియద్దీన్ బాద్షా సద్గురువర్యులవద్ద ధర్మం తీసుకొన్నారు. శ్రీమతి సూరయ్యమ్మగారు వారి సద్గురువర్యులకాలంలోనూ తదనంతరము షష్టమ పీఠాధిపతి బ్రహ్మర్షి డా॥ ఉమర్ ఆలీషా సద్గురు వర్యుల కాలంలోనూ, అపారంగా సద్గురు సాహచర్యం, ఆధ్యాత్మిక చింతనలతో కాలం గడపడమే కాకుండా తమ కుమార్తెలైన శ్రీమతి కలిదిండి సీతాదేవిగారు మున్నగు సంతానానికి మహామంత్రోపదేశము యిప్పించిన త్యాగధనురాలు.

శ్రీ కలిదిండి సీతాదేవిగారు, బ్రహ్మర్షి ఉమర్ ఆలీషా (షష్టమ పీఠాధిపతి) వారి కాలంలో మహామంత్రోపదేశము తీసుకొన్నారు. అప్పటి నుండి బ్రహ్మర్షి హుస్సేన్‌షా సద్గురువులను, బ్రహ్మర్షి మొహియద్దీన్ బాద్షా సద్గురు వర్యులను (అష్టమ పీఠాధిపతి) ప్రస్తుతము పీఠాధిపతిగా నున్న డా॥ ఉమర్ ఆలీషా సద్గురువర్యులను, వంశక్రమముగ బీరువోని అచంచల భక్తి, విశ్వాస, త్యాగ రూపములలో యీనాటికి అలరారు మహోన్నతమైన శ్రీమూర్తి.

త్యాగశీలియైన శ్రీ కలిదిండి సీతాదేవిగారు ఆమెభర్త శ్రీ రామ కృష్ణంరాజుగారు యీ పవిత్ర గ్రంధము ముద్రించుటకు తోడ్పడి ధన్యులైనారు.



# BRAHMARSHI

# Dr. UMAR ALISHAH

## TELUGU POET

'A really great man has ideas always greater than himself'. This is more true of Dr. Umar Alisha, the immortal poet of the Telugu language, than anyone else. He was born on March1885 in Pithapuram, a town in the Andhra State of India.

Though he had no proper education he developed a great taste for Telugu which was not his mother tongue and began writing verse when he was a teenager. The genius of the boy was at once recognised by Telugu scholars and his fame grew as a poet by the time he was 18.

He wrote plays in Telugu which can only find a parallel in Shakespeare's. Many Hindu poets and scholars bagan to pay tribute to this Muslim poet of the Telugu language and regarded him as a itern-poet in the Carlylian sense of the word.

His writings took a new shape in all branches of literature. Besides poetry he wrote novels, playlet and essays which excelled the writings of the renowned Telugu scholars of the twentieth century and so on his works found a permanent place in the annals of Telugu literature.

Today he stands alone like a pole star guiding those Who are interested in Telugu literature, and he is acknowledged as their great master who brought a change over literary forms in Telugu.

He also made fresh departures in almost every form of literature. His poetry has no parallel in Telugu despite the great writers whose works no doubt come nearer to his standard, and yet lack that charm and candence, lucidity and masterly style both in narration and criticism.

His vast knowledge of Sanskrit which language also he was a scholar, contributed effectively towards his prodigious efforts in Telugu with his contribution. Telugu literature would be nowhere as rich as it is today.

What Shakespeare is to the English, what Dante is to the Italians, what Dr. Iqbal is to Urdu speaking Muslims, Dr. Umer Alisha is to the Hindus of Andhra.

His writings have no other parallel, as I stated before, in any other literature of the world because they are the creation of the one man. He had to his credit such a vast bulk of written work in all literary forms that no one author in English or any other language could have produced.

But Alas! It is confined to Andhra, and Andhra only, and its great merit lies hidden outside the state even in India not to speak of foreign countries.

Yet his repuation, by a curious twist of fate, soared aloft'

In 1936 the International Accademy of America confirmed upon him the degree to doctor of literature for his thesis in Telugu. For a man with no university education to obtain such a high degree from the new world is certainly a matter of pride to the individual as well as to the province in which he was born

He was no ordinary intellant, thought he knew little English when compared to his ability in Telugu and Sanskrit.

His works in Telugu are clear evidence of what he struggled for, lived for and clide for. He was out and out a nationalist purposed to feform the people around him culturally, Socially economically and politically, and accordingly he rendered youngman service to humanity at large during that little span of his meteoric rice.

He did everything in his capacity. His School of thought pervaded all his works and helped remove the dogmatic ideas and beliefs of the ignorant and the illiterate and led them to the supreme path of glory and virtue.

This won for him a saintly honour and he came to be regarded by all Hindus as a saint. His writings spelled the qualities of a great seer.

Though he was a muslim, the magnanimity of the Hindus could not deprive him of what he was in truth, nor did they (the Hindus) leave him in the lunch, but nursed his genius tenderly till it gave them the best of the life they needed. And he did not disappoint them.

Dr. Umar Ali Sha was also a social reformer in his own environs. He had reformed the Hindus customs and manners by dint of his profound knowledge Sanskrit and the Hindu philosophy which he had mastered.

He know more them any Hindu scholar of his day. He could recite slokas so fluently and so correctly intepret them in Telugu that the pandits were stunned at his mastry.

All Hindus of Andhra admit that he had surpassed all in every branch of Telugu literature and he came to be regarded as the only eminent poet in modern times in that language.

His writings created a sensation throught Telugu speaking areas both within and outside Andhra State. Indian universities adopted his works in their curricular for degree classes and no library is without his books.

His political career overlapped his literary one and he was so engrossed in both that it is very difficult to think of the one without the other.

During the last decade of his life his literary fame was at its highest, While his political activities continued till his death.

He had to make many trips every year from south to north to be presence in the Legislative Assembly at Delhi from the time when he was elected independently in 1935. From them on he used to repair to the hill-tops of Simla to invoke the muse and produce his master-pieces In Telugu literature, even in his political travells.

Apart from his literary acties, his political career was also remarkable. He was known as a good politician. Mahatma Gandhi accepted him as a man with sound politicai ideas when he was in Congress upto 1935.

He worked for the nation unhesitatingly during the khilafat movement and was held in high esteem by all the national leaders of those times. His assemble speeches contained sound principals of integrity and magnanimity and therefore saw the press of his day.

Besides, he worked for the good of the country delivering lectures everywhere irrespective of religian cast or creed with a

view to promoting goodwill amongest the people for which he was adored by Muslims and Hindus alike,

When he was preoccupied with political affairs and when his literary fame was at its zenith, he was suddenly shaken by a tragic event His beloved wife Akbarbebi died Delhi in April 1935 when he was attending the sessions.

This shock are into his vitals and he breathed his last in January 1945 after a cerebral hemorrhage in a village of Narsapur.

His body was brought for burial to Pithapuram where every year congregational meetings are held for one week by his 20,000 disciples including eminent poets and scholars of Andhra state in honour of their great hero-poet and he lies forever enshrined in their hearts.

**—M. N. HUDA**






కీర్తిశేషులు శ్రీ ఉమర్ ఆలీషా కవిగారు నాకుఁజిరమిత్రులు, కవిగా, బండితుఁడుగా వక్తగా, ఆధ్యాత్మవేత్తగా, కేంద్రశాసనసభ్యుఁడుగా వారు విశ్రుతిగాంచియుండుట యాంధ్రలోకమునకు సుపరిచితము. వారు బహుగ్రంథకర్తలు ఆకృతులలో వారిజీవిత కాలములోఁ గొన్నినాటకములు నవలలు, తత్త్వగ్రంథములు, గేయములు మాత్రమే ముద్రితమయి లోకమున కెఱుకపడియున్నవి. కాని గణ్యములగు సత్తమకృతులు కొన్ని వారు జీవించియుండఁగా ముద్రితములయి ప్రకటనమందు భాగ్యమునొంది యుండలేదు. అందుచే వారి పుత్రులు, శిష్యులు వారి యముద్రితకృతులను బ్రకటించుటకును. ముద్రితములయినవానిలో నవరసమైనవానిని బునర్ముద్రణము గావించుటకును సంకల్పించి తన్మూలమునఁ ధన్యులగుటకు "శ్రీ ఉమర్ ఆలీషాకవి గ్రంథప్రచురణ సంఘము" అను పేర సారస్వత సంస్థను నెలకొలిపి భాషాసేవను గావించుచుండుట మిక్కిలి ప్రశంసనీయము ఈ గ్రంథమండలి పక్షమున నింతపఱకుఁ గవిగారి యముద్రితకృతులలో శ్రీ ఉమర్ ఖయ్యామ్, ఖండ కావ్య సంపుటి, "అనసూయ-కళ" నామక నాటకద్వయము తత్త్వసందేశము, అనునవి ప్రకటితములయి ప్రచారమందున్నవి.

శ్రీ ఆలీషాకవిగారికి శ్రీ మహమ్మదు ప్రవక్తయెడఁ గల భక్తి మేర యిడరానిది. ఆంధ్రదేశమున మహమ్మదీయ సోదరులందందుఁ గావించెడి "మహమ్మదు జయంతి" సందర్భములలో వారొసంగెడి యుపన్యాసముల విన్నవారి కీవిషయము విదితమయే యున్నది. బహుగ్రంథకర్తగాఁ గవిగారెన్ని గ్రంథముల వ్రాసినను నవి వారి హృదయమునకంతగా సంతుష్టిని గూర్చియుండలేదు. శ్రీ మహమ్మదు రసూలువారి జీవితచరిత్రమును మహాకావ్యరూపమున రచించి ప్రచురించినఁగాని తమ జీవితాదర్శము పరిపూర్ణము కానేరదని వారు భావించుచుండిరి. అందుచే జరమదశలోవారు తత్కావ్యరచనముకయి యుపక్రమించియుండిరి. కాని

"శ్రేయాంసి బహువిఘ్నాని" అను సూక్తి చొప్పున వారాకావ్యరచనము పూర్తిగావింపకమున్నె యకాలమునఁ గీర్తిశేషులగుట గొప్పదురదృష్టము.

ఆలీషాకవిగారు నిరంతరము బహుకార్యనిమగ్నులై యుండెడివారు. అది వారి మిత్రమండలికి నాత్మీయవర్గమునకు లెస్సగా ననుభవమయిన విషయమే. ఏగ్రంథరచనకుఁ బూనుకొన్నను వారికినిండయినమనశ్శాంతితోఁ దదేకదృష్టితో మహాదీక్షావిధితో దానిని నిర్వహించునవకాశముండెడిదిగాదు పద్యములగాని గద్యములగాని మునుముందు తొందర తొందరగా రచించి చిత్తుస్థితిలో వానినుంచివేసి, తరువాతఁ బ్రకటనావసరములందు మాత్రమే వానిని మరలసరిచూచి సవరించి ముద్రణమునకిచ్చుట పరిపాటిగా జరిగెడిది అందునను జరమ దశలో వారు మఱింత యలజడితోనే కాలమును గడపిన వారు అందుచేత నెంతయభిమత కార్యమయినను నవసానదశలో నుద్యమింపఁబడిన యీ మహాగ్రంథరచనము. అసమగ్రముగ నిలిచిపోవుటయే గాక, రచింపఁబడినంతవఱకయినను, వారిచే మరల సరిచూడఁబడి ప్రకరణ విభాగమేర్పడి ముద్రణము కనువగురీతిని సాపుగా వ్రాయఁబడుటజరిగి యుండలేదు. అందుచే శ్రీ కబీర్‌షాగారు అందతుకులుగా మిక్కిలి చిత్తు స్థితిలోనున్న యీ గ్రంథశకలములనుజేర్చి సాపువ్రాయించి యీ కృతిని ప్రకటనార్హమగు గతికిఁదీర్చి పరిష్కరించుభారమును నాకప్పగించిరి. ఇది వాతలకుమీఱినపనియని బాగుగా నెఱింగియు గ్రంథావతారికలోని మొదటి 66 పద్యములను జదివినంతనే, కీర్తిశేషులయిన నామిత్రులు ఆలీషాకవిగారెట్టి పవిత్రోన్నతభావముతో నీమహాగ్రంథరచనము సంకల్పించి యుపక్రమించినదియుఁ దక్కిన కృతులకన్న నీ కృతిరచనము వారికెంత యభిమతమయినదియు వ్యక్తముకాఁగా, మిత్రవర్యుని యీయుత్తమ కృతిని లభించినంతవఱకయిన లోకమునకు బ్రకటించుటలోఁ దోడ్పడుట నాకుఁ గూడఁ బరమవిధియని గ్రహించి నాయశక్తి యనర్హత గమనింపకయే చేతనయినంతవఱకు శ్రమించి పరిష్కరించి వారికర్పించితిని.

ఇస్లాముమతమునకు సంబంధించిన పూర్వగ్రంథములేవియు నేను జదివియుండలేదు. అరబు, పెర్షియను వాఙ్మయములతో నాకు బరిచయ మునులేదు. అందుచే మతతత్త్వ నిరూపణములోనేమి కొందఱు పురాతన వ్యక్తుల నామముల నుదహరించుటలోనేమి యిందుఁ బెక్కు వ్యత్యాస ములు దొరలియుండవచ్చును నాపరిష్కరణము చాలవఱకు భాషావిషయిక మయినది మాత్రమే.

ఆలీషా కవిగారు మహమ్మదువారి జీవితచరిత్రమును ఇస్లాముమత ప్రచారచరిత్రము నెంతదనుకరచించి గ్రంథము నేరూపమున నెట్టిస్థితిలో ముగింపనెంచిరో తెలియదు. ఇస్లాముమత మేకేశ్వరోపాసనాత్మకమనుట జగద్విదితము. మహమ్మదువారు జనించునప్పటికి అరేబియాదేశము బహు రూపకములయిన విగ్రహారాధనములకు, దురాచారములకు నిలయమై యుండెడిది. దేశీయులు వానికి లోనయి, తరతరములనుండి వేళ్ళపాఱిన సాంఘిక దురాచారములకు దాసులయి, సదసద్విచారవిదూరులయి, పూర్వా చారములందలి మూఢవిశ్వాసములతో వాని నిర్వహించుటలో మొండిపట్టు దలను గలిగియుండెడి వారు అట్టివారికి హితబోధగావించి వారిలో సత్య సమ్మతమయిన యేకేశ్వరోపాసనా మతమును బాదుకొల్పుట యెట్టివారికిని దుర్ఘటమే యని చెప్పనక్కరలేదు. ఇట్టిపరిసరములలోఁ బరిస్థితులలో నవ తరించిన మహమ్మదువా రెన్నివిన్ని బాములుపడి యరబులలో ఇస్లామును నెలకొల్పఁగల్గినది ప్రకృతగ్రంథమునఁ గాననగును, వారివంశము, జన నము బాల్యము, వివాహము,సంతానము ,పూర్వప్రవక్తలచరిత్రముమున్నగు విషయములు సంగ్రహముగ వివరింపఁబడి యటుతరువాత ఇస్లాము మత తత్త్వసిద్ధాంతములు, వాని నామోదింపక పూర్వాచారపరాయణులగు ఖురే షులు మహమ్మదువారితోఁ బ్రతిఘటించి వారికి ఘటించిన కష్టపరంపరలు నెక్కువగా నుదహరింపఁబడినవి. ఎట్టి యిక్కట్టు లెదుర్కొన్నను సత్య మతస్థాపనకయి ప్రవక్తగాఁ దన్నవతరింపఁజేసిన అల్లాయె (పరమేశ్వ రుఁడే) యడ్డంకులనెల్ల నివారించి నిజాభీష్టమును జయప్రదముగా నిర్వ హింపఁగలఁడనుదృఢవిశ్వాసము తోమహమ్మదువారీశ్వరునేశరణముగాగొని

యెంతమాత్రమునిరుత్సాహ మొందక తమ మతబోధను సాగించుచుండిరి. అనన్యశరణ్యబుద్ధితో నీశ్వరోపాసన మొనర్చువారికిఁ దారసిల్లు సిలుగులెల్ల మంచువలెవిరిసి విజయసిద్ధి గలిగితీరునని సకలదేశ వాఙ్మయములును జాటుచున్నవి. "కులిశం కుసుమతి, దహనస్తుహినతి, వారాంనిధిర్ధ్రువంస్థలతి శత్రుర్మిత్రతి విషమప్యమృతతి, శివేతి ప్రలపతో భక్త్యా" (పవిపుష్పంబగు నగ్ని మంచగునకూపారంబు భూమీస్థలంబవు శత్రుండతి మిత్రుడౌ విషము దివ్యాహారమౌనెన్నఁగా నవనీమండలిలోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్") అని చాటినాఁడొక మహాభక్తుఁడు ఇట్లేమహమ్మదు వారిని ప్రబల విరోధులయి ప్రతిఘటించిన ఉమర్ మున్నగు ప్రతిపక్షప్రముఖనాయకులే క్రమముగా నాత్మప్రబోధమంది మహమ్మదు వారికి శిష్యులయి తన్మత ప్రచారమునకయి వారికి బాసటగునిల్చిన తెఱంగులిందెఱింగింపఁబడినవి. అంతటితోఁ దక్కిన ఖురేషులెల్ల బీరమునీఁయి వేఱుగతిగానక ధైర్యము దక్కి నిర్వేదముతో స్వదేశనిర్గమన మొనర్చినారని చెప్పుటతోఁ బ్రకృత గ్రంథమందలి కథాభాగము ముగిసినది. ఇందువలన మహమ్మదువారి విజయసిద్ధి ప్రతిపాదితమయినట్లే గ్రహింపనగును. అందుచే దీనిని ప్రథమభాగమని పేరిడి ప్రకటించితిని. గ్రంథముచివరనున్న గద్యమేము గూర్చినదేగాని ఆలీషాకవిగారు వ్రాసినదికాదని చదువరులకు నివేదించుచున్నాను.

ఆంధ్రులలో మహమ్మదీయసోదరులేగాక యితరులుగూడ నీకృతి నాదరించి శ్రీ మహమ్మదుప్రవక్త వారిచరిత్రమును గ్రహించి ధన్యులయ్యెదరుగాక యని యాచించుచున్నాను.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
బండారు తమ్మయ్య

కాకినాడ
18-3-55

# కృతి

## శ్రీ అక్బరున్నిసాబేగం గారు

అద్వితీయపరబ్రహ్మ నుద్ధిగాగ
అందు మొదటి తరంగమై యలరి వెలయు
నామహమ్మదుస్వామి నేనాత్మయందు
దలతు నైహికాముష్మిక ఫలములకును.

*　　*　　*

అతి సుగుణాన్వితయగు నా
సతి "అక్బరు" ఢిల్లి పురిని చనియెను దివి కీ
కృతి కృతిగా నిడెద సు
కృతిని మహమ్మద్రసూలు కృప కాపాడన్.

# శ్రీ మహమ్మద్ రసూల్ వారి చరిత్ర



శ్లో. హేఅల్లా కరుణాంక ! లోకజనకా ! కళ్యాణసంధాయకా !
పాపానేకదురంతదోషహరణా ! సర్వంసహావందితా !
ధ్యానధ్యేయమతత్రయైకవినుతా ! ఇస్లాం ప్రతిష్ఠాపకా
త్వాం మాంపాహి "ఖుదా" నమామి సతతం భక్తిస్వరూపాన్వితం. 1

మ భగవంతుండు దయామయుండు నిఖిలవ్యాపారపారాయణుం
డగుణుం డవ్యయుఁ డక్షరుండు భయమాయాతీతుఁ డోంకారుఁడై
జగముల్ మూఁడు సృజించి తత్ప్రజకు విజ్ఞానంబు ధర్మంబుఁ దె
ల్పఁగ నూహించి ప్రవక్తలన్ బనుచు నల్లాఁగొల్తు నిష్టార్థినై. 2

శా. అల్లాయంచు జపించుచున్ మది విధి ధ్యానంబు గావించు వా
రెల్లన్ జన్మతరింతు రీశ్వరుని నెంతే నాత్మదర్శింతు రే
కల్లోలంబులఁ జెందరన్నిట మహాకల్యాణముల్ శాంతి సం
ధిల్లన్ గాంతురు జీవితాశయము వ్యక్తిత్వంబు సౌభాగ్యమున్. 3

ఉ. నీదయకేదిసాటి మహనీయుఁడవీవు కృపాపరిపూర్ణ! నీ
వేదితలంచినన్ జరుగ దీ? శ్వరుఁడీవు చరాచరాళి నీ
లోదయివాఁబు రేఁబవలు లోకములన్నియు దేవదేవ! మా
పై దయఁజూపు మ్రొక్కెదము బంధమువాయ రహీంఖుదాప్రభూ. 4

## శ్రీ రసూల్ మహమ్మద్ వారు

శా. ఆయాధ్యాత్మిక దివ్యతేజమొక కేంద్రాకారమై భూనభో
ధ్యేయంబై పరతత్త్వమై యమృతదివ్యద్యోతకంబై ప్రజా
గేయంబై యరుదేర నా తెలుఁగు జేగీయంబుగా వెల్గుఁ ద
న్మాయాదూరమహాపదార్థమె మహమ్మద్ తేజ మూహింపఁగన్. 5

ఉ. ఏది వెలుంగు తాత్త్వికుల కేది నికేతన మేది యీశ్వరో
త్పాదితమైన మాయను ప్రధానముగాఁ గొని సృష్టి సేయఁగా
నేదితలంచుఁ దద్ధృతియతేంద్రియమై సదసత్స్వరూపమై
యాది "అనానియత్త"ను మహమ్మదునే వినుతింతు నాయెదన్. 6

శా. ఏతేజంబు చరాచరాత్మక ప్రపంచేచ్ఛావిహారక్రియా
చైతన్యాత్మకమై గుణత్రితయనిస్త్రాణంబు మాత్రోర్మియనీ
భూతవ్రాతమనంత విశ్వచయసంభూతంబునై వెల్గునో
యా తేజంబు మహమ్మదై వెలసె "అల్లారబ్రహీ" మంచనన్. 7

మ. ఒకఁడే యీశ్వరుఁ డన్యదేవతల నుద్యోగించి ధ్యానించి మా
యకులోనై ప్రతిమార్చకుండగుచు మట్టైపోక విశ్వాకృతిన్
ప్రకృతిన్ ప్రాన్పడియున్న శక్తిని బరబ్రహ్మంబుగా మోసపో
వక "అల్లా" యనుఁడంచు దెల్పిన మహమ్మద్ తేజమూహించెదన్.

ఉ. ఏది యసాధ్యమీయఖిల మెవ్వవియందుఁ బ్రదీప్తిగాంచు విం
దేదిపదార్థ మేది సృజియించుచు నున్నదొ యేది యీజగ
ద్భేదములన్ వెలార్చి గుణభేదము లొందని యీశ్వరుండు వాఁ
డే దయివాఱు దైవమని యెంచు మహమ్మదునేఁ దలంచెదన్. 9

ఉ. శోకము మోదమున్ గలిగి శోభిలుచున్ నిజకాంతిలేని యీ
లోక మదేమివస్తువొ విలోకనసేయుట కందరాని య
స్తోకమహాపదార్థములు తోరణకట్టెడు నందు రూఢమై
యేకము నద్వితీయమగు నీశ్వరుఁగన్న రసూలు నెంచెదన్. 10

తే. గీ. అణువులందు రేణుల జలకణములందుఁ
గలఁడు సర్వేశ్వరుండైనఁ గానివాని
వదలి యేకాద్వితీయదైవమును దలఁచుఁ
డను మహమ్మదు ప్రభుని నేనభినుతింతు. 11

శా. వ్యాసుండీశుఁడు బుద్ధమౌనియు మతవ్యాఖ్యాత యాశంకరుం
దేసుక్రీస్తును మున్ ప్రవక్తలు ప్రపంచేచ్ఛావిహారక్రియా
వ్యాసంగంబులఁ జెప్పలేని హరి విశ్వాకారు "అల్లా" నిధి
ధ్యాసన్ జూపిన శ్రీమహమ్మదును నిత్యంబేను నర్థించెదన్. 12

ఉ. మూఁడు జగంబులం దెవనిఁబోలు మహాత్ముఁడు పుట్టఁబోఁడొ; యే
నాఁడు నమోమహమ్మదను నామము దిక్తటకుంభికుంభముల్
వేడుకనెక్కి పాడుచుఁ బ్రవీణతనాడునొ కీర్తికాంత మా
ఱేఁడని; యారసూల్ ప్రభువరేణ్యుని నెంచెద నేఁదరించఁగన్. 13

ఉ. ఎవ్వని జీవితావధి యహింసకు ప్రేమకు యౌగికాప్తికిన్
దివ్యవిధాన లక్ష్యమయి దీప్తివహించునొ యెల్లవేళలం
దెవ్వని పాదధూళి వివిధేప్సితసిద్ధులఁ గూర్చు భూతియో
యవ్విభులోకవంద్యుని మహమ్మదునే శరణంబు వేఁడెదన్. 14

మ. భగవంతుండు వచించు వాక్యములు "జిబ్రాయేలు" బోధింప నీ
జగముల్ మూఁడు తరింపఁబాడెను ఖురాన్ స్వర్గీయ సద్గీతికా
మగవిన్ స్వారిగఁబోయి యీశ్వరునితో మాట్లాడి యిస్లాము భూ
మగతిన్ దీరిచి యుద్ధరించిన మహమ్మద్స్వామి సేవించెదన్. 15

చ. ప్రతిమలఁ గొల్చువారి భగవంతుని పేర సరీసృపంఁ
స్తుతి నొనరించువారి రవిసోముల విష్ణు వినాయకాదిః
వతలను మ్రొక్కువారి జడభావములన్ బరిమార్చి
డత డొకఁడే ఖుదాయను మహమ్మదు నెంచెద మో

చ. ప్రతిమలఁబట్టి దేవుఁడని పామరులై భజియించువాఁ
ర్గతి నరకాగ్ని కింధనములై వడి మాడి నశింతు రీశ్వ
డతుల దయాసముద్రుఁడు ననంతుఁ డతీంద్రియుఁ ఁ
కృతి భజియించుఁ డంచు విధియించు మహమ్మదునే

ఉ. ఏమహనీయమూర్తి కయి యీజగముద్భవమై తరించె
కామదవాగ్నిలోఁ బడి వికావికలై నశియింపనున్న ఁ
భూమిఁ బ్రజాప్రపంచముఁ బ్రపుణ్యపదంబునఁ బెట్టి
యామహమద్ రసూలును నహర్నిశమున్ మదినిల్పి

ఉ. ఈశ్వరుఁ డొక్కఁడే ప్రజలనేకులు భ్రాంతులు తారఁ
నశ్వరమైన భావము లనంతకళాకలితంబునైన యీ
విశ్వము రెండునాళ్ళవి వివేకముతోఁ బరమార్థమందు
శాశ్వతదృష్టి నిల్పుఁడని చాటినమేటి రసూలు నెంచెఁ

ఉ. పుట్టినదాది కష్టములఁ బొందుచు నుగ్గుఁబాలతోఁ
బెట్టినరీతి నోర్చుచుఁ బవిత్రచరిత్రముచేత వైరులన్
బట్టి యథార్థమార్గములఁ బావనులన్ బొనరించినట్టి ప
ట్టు రసూల్ ప్రవక్తఁ బరమప్రభు నే శరణంబు

ఉ. నేరని చిన్నఁనాడు జననీజనకుల్ దివికేఁగ నా నిరా
ధారదినాలలోఁ బిలిచి ధైర్యము చెప్పెడువారు లేక కా
తారములందు గొఱ్ఱెల నదల్చి ప్రవక్తృ పదంబుగన్న
జోరవి శ్రీమహమ్మదు రసూలును నే శరణంబు వేఁ

ఉ. పూతచరిత్ర మన్నిటికి ముఖ్యము నైతికశక్తి లేనిదే
జాతియుఁ బైకివచ్చి మనఁజాలదు కావున "ఇస్లాము" వి
ఖ్యాత వినీతి సత్వపుఁ బునాదులపై నెలకొల్పి పాతక
వ్రాతము నాపదాహతిని బాపితి నన్నరసూలు నెంచెదన్. 22

చ. అరబుల జాతిగుండియల నన్నిటిఁ బ్రేమరసైకకాంతి సం
భరితముఁజేసి యీశ్వరుని భక్తి నిబోసి ప్రపంచవాంఛలన్
దొఱఁగ నమాజుశీలమును దోరపుశౌచము పూసి పుణ్యస
న్నిరతము సల్పినట్టి మహనీయ మహమ్మదు నాత్మనెంచెదన్. 23

ఉ. జూదరు లాత్మవంచకులు క్షుద్రదురాగ్రహులాసవాదికో
న్మాదపదార్థసేవకులు మానవహంతకులంగనారతుల్
కాదనకట్టి మూర్ఖుల నఖండవివేక ఖురానుగ్రంథసం
పాదనచే మరల్చిన కృపారసపూర్ణు "నబీ" ని నెంచెదన్. 24

కం. ధరణి దురాచారంబుల
బరిమారిచి శౌచశీలఫక్కిని నీశే
శ్వరుని నుపాసించుచు లో
నరయఁగబోధించు నామహమ్మదు దలఁతున్. 25

కం. కరుణయు దీనులపై నా
దరణము స్త్రీలయెడ నీతిధర్మము భ్రాతృ
స్ఫురణము ఋజుమార్గము ప్రజ
లరయఁగ ఇస్లాము నామహమ్మదుఁ నెంతున్. 26

ఉ. ఎవ్వనిజీవిత ప్రతతి యెల్లతమస్సును బాపితేజమై
నివ్వటిలంగనోపునొ యనేకమహత్త్వములొక్క వ్రేల్మిడిన్
వెవ్వెఱఁగందఁజూపెనొ యనేకచరాచర జీవకోటిలో
నెవ్వని కాంతినిండి యగుపించునొ యట్టిరసూలు నెంచెదన్. 27

ఉ. ఈశ్వరుఁడన్న పేరు బహుళేశ్వరమైనది కాని యొక్కఁడే
విశ్వవిభుండటంచు నొకవేత్తయుఁజెప్పఁడు; చెప్పె శ్రీరసూల్
శశ్వదలంకృతంబయిన సర్వము భౌతికరూపభేదమీ
నశ్వరమందు దేవుఁడు కనంబడునన్న రసూలునెంచెదన్. 28

తే. గీ. నశ్వరంబగు జగము విన్యస్తమైన
వస్తువున కుపాదానమై పరగునట్టి
యీశ్వరునకును జైతన్యమెనసినపుడు
తోఁచినవెలుంగె మహమదు స్తుతియిఁకేల? 29

చ. అదియమృతంబు సత్పదము నవ్యయ మాసుబహాన్ సముత్సుక
ప్రదమహిమానుషంగము సబాహ్యమునంతర మింద్రియానుషం
గదహన కారణంబును ప్రకంపిత మైహికమా మహ
మ్మదు మహనీయతేజము నమాజునఁ జూతురుగాదె భక్తులున్. 30

—• అబాబకర్ సిద్దీఖ్ •—

చ. కలధనమెల్ల నర్థులకుఁ గాదనకిచ్చిన దాత నూతిలోఁ
జిలువవిషంబునున్ సరకుసేయక వేడ్క రసూలుసేవలో
నిలిచిన మేటి భక్తిరస నీరధిలోఁ జనునావ; ప్రేమ రా
జిలు ఘనుఁడా "అబాబకరుసిద్దిఖు" నెంచెద నిష్టసిద్ధికిన్. 31

—• ఉస్మాన్ •—

చ. శిలమయిపోవకుండఁ బలుక్లిష్టసమస్యల నుక్కడంచి కే
వలము "ఖురాను" సంపుటము వ్రాసి సముద్ధరణం బొనర్చి ని
శ్చలనము పాపితంబగు యశస్సునుగన్న మహాత్మునుస్సమాన్
దలంచెద నిష్టసిద్ధికి నితాంత మహామహనీయశీలునిన్. 32

## ఉమర్

ఉ. మూఁడుపురంబులన్ శివుఁడుమున్ను జయించెనటంద్రు; ధాత్రిఁబో
రాడి యనేక లక్షలపురంబులుగెల్చె ఉమర్ మహాత్ముఁ డా
నాఁడు జగంబుమెచ్చఁ గరుణామయుఁ డాతని కెవ్వరీడు కొం
డాడఁ బదార్థశక్తు లొకటన్ విడఁదీసిన మేటినెంచెదన్. 33

## అలీ

ఉ. కాలువినైనఁ ద్రోలు ఘనకాయ "మహాబలశాలి విద్యచేఁ
జాలి యనంతవిశ్వమును జక్కఁడగించి తపస్సుచేత లో
కాళిని గీలుబొమ్మలుగనాడఁగఁ జేసిన తత్త్వవేత్త మా
లాలిని లోకమాన్యునిఁ గళాపరిపూర్ణుని నాత్మనెంచెదన్. 34

## ఫాతిమాదేవి

క్రం. సతులకుఁ దలమానికమై
స్తుతిగాంచిన లోకమాత సూనృతయమృతా
కృతసుగుణాన్విత సద్వ్రత
మతి నే సేవింతు ఫాతిమాదేవి నెదన్. 35

## హసన్ హుస్సేన్

కం. మతముఖితాఫ తెజీదులు
హతమార్పఁగఁ జూడ వారి నవరోధింపన్
ప్రతివవహించి రణావని
హతులైన హసన్హుసేన్ మహాత్ములఁ దలఁతున్. 36

— పిరానెపీర్ —

ఆ. గీ. శ్రీపిరానెపీర్ "నబీ" పాదములు మూఁపు
నందు మోయ యత్పదాబ్జములను
గురువులెల్ల మోయఁగోరిరొ యట్టి మొ
హియ్యదీన్ జిలానీ నెదఁ దలంతు. 37

— ఆఖల్ అలీషా —

శా. మాయాతీతుఁడు భక్తవంద్యుఁడు జగన్మాన్యుఁడు నధ్యాత్మికా
ధ్యాయాధిష్ఠితుఁ డవ్యయుండు నిజవిద్యన్ జ్ఞానమార్గంబు త
ద్ధ్యేయధ్యానగరిష్ఠమైన పదముద్దీపింప బోధించునా
శ్రీయాఖై లలిషాగురూత్తముని నేసేవింతు నిష్టార్థినై. 38

— అస్మద్ వంశము —

కం. మాతాత కహనషావలి
మాతండ్రి మొహిదినుబాద్ష మానితగురుల
ద్వైతాధ్యాత్మిక విద్యా
వేతలయి వఱలిరి భక్తనివహము మెచ్చన్. 39

— చాన్బియాంబిక —

చం. పరమపవిత్రసూత్ర సముపాసితచారుచరిత్ర సాధ్వి వి
స్ఫురితతపస్సరోరుహసముజ్జ్వలమిత్ర కళావిచిత్ర, భా
సురమతిపాత్ర సూనృతవిశోభిత యాస్తికకల్ప చైత్రబం
ధురశశిగాత్ర మజ్జనని దోయిలిమొక్కెదఁ జాన్బియాంబికన్. 40

ఉ. కావ్యములన్ ప్రబంధములు గాథలు పాటలు నాటకంబులున్
దివ్యకవిత్వ శిల్పములు దీర్చితిఁబల్లవలల్ పురాణముల్
భవ్యచరిత్రముల్ కథలు వ్రాసితినాళువుగాఁగ వెన్నియో
నవ్యవధానముల్సలిపినాఁడను ఉమ్రిలిషాకవీంద్రుఁడన్. 41

ఉ. ఏను ప్రవాహవేగముననేఁగెడు మత్స్యములీలలోకవాం
ఛానదిఁబోవుచుండ నొకసారి మహమ్మదువారువచ్చి పు
ర్ఖానుపఠింపఁజేసి రతిగౌరవమొప్పఁ దెలుంగు నేయ నా
మానసమందుఁదోచె ఋజుమార్గమునన్ ప్రజలున్ దరింపఁగన్. 42

శా. ఆపుర్ఖాను ప్రవక్త జీవితముతోఁ బ్రారంభమై లోక వి
ద్యాపారాయణమైన వాఙ్మయముతోఁ దర్కించి యధ్యాత్మిక
శ్రీపర్వంబులమోసి యీశ్వరునెదన్ సేవించు మార్గంబుతో
రూపించన్ జనుదెంచెఁ గావున రసూల్ రూపంబు చిత్రించెదన్. 43

కం. ఆమహనీయ మహమ్మద్
స్వామిమహా జీవచరిత చారిత్రక వి
ద్యామార్గంబునఁ గలనిజ
మేమిటొ యెఱుగంగఁ బలుకునెడ నొకనాఁటన్. 44

గీ. శ్రీమహమ్మద్ రసూలు సంస్థితితలంచి
శాంతి నిద్రించమాతల్లి చాన్బియాంబ
కలిసిమక్కాను జంజము కొలనినీరు
త్రావుచున్నట్టు కలవచ్చెఁ దత్పదమున. 45

ఉ. ఒకమహనీయమూర్తి విమలోజ్జ్వలకీర్తి దయార్ద్రనైకకృ
త్సకల కలాకలాప గుణసంపదవర్తి విశోభితాభినం
దక విజయప్రపూర్తి భవదాహనివర్తి పవిత్రవిస్ఫురత్
ప్రకటనటత్ ప్రవక్త పదవర్తి మహమ్మదుచక్రవర్తి దాన్. 46

సీ. ధారాధరంబులు తోరణంబులుగట్టి
కుంభవృష్టిని సుధల్ కురియుచుండ
ముక్కోటిదేవతల్ మందరకేతెంచి
స్వస్తిపాఠంబులు సలుపుచుండ
స్వర్ణదీనారముల్ స్వరయుక్తకృతుల సు
స్వాగతంబులు బరాబరులు సేయ
సృష్టిచరాచర జీవజాలంబులు
రమణీయ దివ్యహారతులనీయ

తే. గీ. ఇట్లు స్వర్లోక మిలఁ దిగినట్లుతోఁచ
స్వచ్ఛమైన ప్రశాంత తేజంబునందు
ఆమహమ్మదువారు ప్రత్యక్షమగుచుఁ
బ్రేమనాశీర్వదించె నివ్వెఱగుఁజెంద. 47

సీ. కాలమేఘంబులు కలసిపోయెడువేళ
మెఱుపులతోఁదోఁగు మింటిపగిదిఁ
బున్నమనెలతేఁడు పొలుపుసోయగములు
వెలఁ బోసికొను వజ్రముల తెఱంగు
ఆణిముత్తెపు సరులలరారు రంగారు
రంగవల్లికలఁ జెలంగునట్లు
వలిగాలియును మషస్సులు మాటలాడుచుఁ
గళలతో నైక్యమై వెలయునట్లు

తే. గీ. తేజమురసమ్ముతోఁ గూడితేటతెల్ల
మైన సంధ్యలను నిశావధూనికేత
నములఁ బొల్చురాగారుణ నవ్యదివ్య
దీధితుల నబీమహామదు తెలియవచ్చె. 48

చం. అదినిజమైన తేజము మహాద్భుతమందుఁ బ్రపంచసత్కళా
స్పదములు కేంద్రమై సొగసు సౌరభముల్విభులూరు నామహా
బదము సుధాంశుసన్నిభము భావ్యము రాలు వరాలు పోసితేఁ
గదొరకదెందువినూత్న కథకంబగు దృశ్యమువేయు నేర్చినన్. 49

వ. అంత మహమ్మదు రసూలువారు. 50

కం. ఎదురై మాస్తుతులకు నా
స్పదమగు గౌరవముగూర్చి చనితన "గోరీ"
సదనము స్వర్గీయ మహా
పదమును జూపించెఁ బ్రేమపద మేపారన్. 51

ఉ. ఆనిరవద్యమై విమలమైన మహాబహిరంగమందు మై
దానము చూడఁజోద్యము గతాగతికంబగు నేలజాలతో
జానయి సొంపులేని యొక చక్కి సమాధినిజూపి శ్రీరసూల్
స్థానముగాఁగఁ జెప్పెనది తథ్యమె చెప్పుఁడటన్న నాతఁడున్. 52

కం. ఒకవేళ్రిలితోడ సంజ్ఞను
బ్రకటింపఁగ "గోరి" రెండుద్వారాలై వి
ప్పక విడిపోయెను పచ్చని
మకమలు మేల్మిసుఁగుతోడ మఱియొకటుండెన్. 53

చం. ఇది మహమ్మదసూలు విభవేప్సితమైన సమాధి బాహ్యదృ
క్పథమున సొంపుచాలనియ గౌరముకట్టిరిగాని యామహ
మ్మదు మహనీయమూర్తి నిజమార్గముఁగన్న పరిజాప్రపంచమా
సదమల స్వర్గధామమునె సారెకుఁజూతురటంచుఁ జెప్పుచున్. 54

వ. తిరోహితమై చనియెనంత నావ్యక్తియే శ్రీమహమ్మద్వారుగా
నెఱింగి తద్దయు. 55

సీ. ముత్యాలు మలిచిన ముస్తీబుగల రత
నాల తోరణములు చాలమెఱయఁ
బచ్చని హొంరుమంజిపాయగంబులనేలఁ
గ్రాలుజల్తారు ముద్రలనుగలిగి
కార్చోపుగల కలంకారిఫర్షులు మేలి
ముసుఁగు పసిండిసొమ్ముల నగళ్ళ
పగడాలగడపలు నగిషీలతలుపులు
దంతాలచౌకట్లు వింతమెట్లు

తే. గీ. గలమహాదృశ్యమందు శృంగాటకముల
వెన్నెలబయళ్ళ తేజస్సు వెలసినట్లు
అమృతవృష్టి నిర్ఝరులు సొంపారినట్లు
శ్రీమహమ్మదుగోరి దర్శింపనయ్యె. 56

కం. ఆదికవి పులకితుఁడనగుచు
ముదమును హర్షంబుఁబొంది పుణ్యమున మహ
మ్మదువారి, వారిగోరీ
పదనము వీక్షించితివని సంతుష్టుఁడనై. 57

కం. పదపడి రమాలచరితము
ముదమొదవరచింప విహిమ మోక్షముగలదం
చెదఁ దలఁచి తలఁచి పుణ్యము
కదయని యువ్విళ్ళులూరు ఘనమతితోడన్. 58

తె. గీ. దేశదేశాల శ్రీరసూల్ దివ్యచరిత
పాడి ప్రకటించి జీవచ్ఛవాలలేవ
మోళ్ళుచిగురింప వ్యాసంగముల నొనర్చి
యెట్టకేలకు వ్రాయ నూహించినాఁడ. 59

కం. ఇది సంస్కృత కావ్యముగా
మొదట రచించుటకుఁ బూని మొదమొదవ మహా
మ్మదువారి చరిత తెలుఁగునఁ
గదా తెలియనగు నటంచుఁగడఁగితి వ్రాయన్. 60

కం. దీనికి "అల్లా" తోడై
ధ్యానాధీన ప్రసక్త తర్కితమతి నా
నానూనాధిక కవితా
స్థానము రసమును ప్రబంధశైలిని నిడుతన్. 61

కం. ప్రతి పద్యము హృద్యంబుగఁ
జతురత రచియింప నెవరిశక్యము; వానన్
బ్రతిచినుకు ముత్యమై శో
భితమతి రాజిలదుళుక్తి వెలసినమాత్రన్. 62

తే. గీ. పేరిమద్భుక్కుల లోపముల్ వెతకఁబడవు
ప్రేమలేనప్డు చదువఁగ విసుగుపుట్టు
నెనసి జ్ఞాన పిపాసగల్గిననెకాని
యిట్టి చరితలు చదువుట వట్టిమాట. 63

కం. ఇనుమును బంగారముగాఁ
గనుమార్చెడు పరుసవేదికైవడి జడభా
వునినైన శాశ్వతునిఁ జే
యును మహామదువారి చరితమొగిఁబఠియింపన్. 64

—• షష్ఠ్యంతములు •—

కం. శీలికినుతగుణ విద్యా
శాలికి నానాప్రపంచసంస్తుత్య కళా
పాళికి "ఇస్లాం" ధర్మా
ధ్యాళికి మహమ్మద్రసూల్ పయంబరుద్యుతికిన్. 65

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన శ్రీమహమ్మదు ముస్తఫా
వారి చరితమను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన 66

—• అరబుదేశము •—

కం. శ్రీకరమై సురుచిర శో
భాకరమై వీరశూర బహుజనచయ ర
త్నాకరమై యభిమాన గు
ణాకరమై సకలవిభవమై యరబొప్పున్. 67

మ. ఘనమై సర్వధరాప్రపంచమును ధిక్కారించు శైర్యోన్నతో
ల్బణమై తైర్థకళాప్రశస్తమయి కళ్యాణప్రదంబై మహా
జనవిద్యా విబుధాలయంబయి మనోజ్ఞంబైన "ఆరేబియా"
యనుదేశంబుడువీధి సూర్యనిభమై యైతిహ్యమై యొప్పెడున్. 68

మ. ఘనమధ్యందిన చండభాస్కరుని ధిక్కారించు తేజంబుతో
ననలంబైనను జల్లనై యెనయు రూక్షాలోకనజ్వాలతోఁ
గనదుత్తుంగతురంగమప్రకట శృంగారరైక భావంబుతో
జనువీరావళి సొంపునింపరబుదేశంబందు స్వేచ్ఛారతిన్. 69

తే. గీ. ప్రకృతి సంక్షుభితస్వరూపమునఁ దిరుగు
ఘోరదారుణజ్వాలా విహారభూమి
సంతత వధావిధాన విశ్రాంతిహీను
లైన జనులుండు వాడలాయరబుచూడ. 70

సీ. పృథువారి పూరపూరితనదీనదసము
జ్జ్వలసరోవరము లచ్చటనులేవు
లలిత సస్యశ్యామలములౌ ప్రసూన వి
స్ఫారిత పదము లచ్చటనులేవు
వివిధమృగార్భక వితతి మేపుచుఁబోవు
జంతుసంతతులు నచ్చటనులేవు
నానావిహంగ వితానకుహూకల
స్వనసుధాలహరులచ్చటనులేవు

తే. గీ. ఆలమందలు బట్టెల నచటలేవు
అడవులనెమిళ్ళు కోయిల లచటలేవు
అబ్జములు తుమ్మెదలు తుమ్మెదలరొద లచటలేవు
హాయినిడు గంధవాహము లచటలేవు. 71

చం. ఇసుకయెడారి మధ్యమున నెండనుఁబీటలువాఱి వారిలే
కసువుల మోము వాసి తమకంబెసఁగనుల్ మఱిలేరు లేరటం
చెసఁగిశిరంబు నాకమునకెత్తి పథశ్రమఁబోవు వారికిన్
వ్యసనభయంబులన్ గొలుపుపర్వతపంక్తులు చూడనయ్యెడున్. 72

చం. అదియొకకోట భూమికిని నాకసమున్ గటకించి పెట్టువన్
చవిగొనుగాలిగిలికిని జాలఁపట్టువఁ బైకిలేచి యా
యవిరళ పాదపచ్ఛవి నహర్నిశమున్ గటకించు నామహా
రవి నిరోధపెట్టు నన్నురాగముకౌఁగిట నాఁచికొంటకున్. 73

తే. గీ. రెండుకొండలు పొడవై యజాండ భీక
రంబులై యొప్పుచుండు నరబ్బుదేశ
కంఠహారంబులను మహాగరిమఁగాంచి
యాకసముతోడ మంతనమాడు ఘనుఁగ. 74

మ. గిరిగర్భంబులు రెండుఁజీల్చుకొని సంకీర్ణంబులై చారుని
ర్ఝరసంజాతము వెల్లువై వసుధ సస్యశ్యామలం జేయఁగాఁ
బఱతెంచన్ మరుభూమి రాక్షసివలెన్ భక్షించునాఁ కొన్నమో
హరతిన్ స్వార్థపరాయణుల్ పరుల లాభైశ్వర్యముల్ చూతురే. 75

తే. గీ. ఎండచేఁగాలి గాలిచేనెగిరిధూళి
నిండినిండారు నాకాశమండలంబు
మేఘములపేరెఱుఁగని నిదాఘవేళ
దుర్దినంబన నిదెయని తోఁచుచుండు. 76

తే. గీ. కర్మసాక్షి మహాతీక్ష్ణకరము లచటఁ
జాచిపై కతకణముల సంతరించి
యనలముగ మార్చితనుఁజూచి యడుగువారి
కిద్దిపాపభూమియని వచించుచుండు. 77

ఉ. ఆశమనాలయంబున నజాండము క్రింద నెడారిపైని నా
కాశముదక్క రెండవది కానగఁరాదు భయంబుశోక సం
దేశమొసంగు నాప్రకృతి తీవ్రవచోరవమాలకించి యా
దేశపువంక నెవ్వరును దిక్కు మొగంబయి చూడరించుకేన్. 78

తే. గీ. ఈ "అరేబియా" యనుపేరు హీబ్రుభాష
యందెడారి యటన్న శబ్దార్థమగుట
నిది మహావాలుకారాశి యిద్ది ప్రపంచ
మున మహాభీషణక్షేత్రమనఁగ నొప్పు. 79

ఉ. అట్టిభయంకరంబగు మహాటవియందు నరబ్బులెందఱో
లొట్టియలెక్కి పోవుదురు లోలమతిన్ సుడిగాలివచ్చి యో
పెట్టున వారినెత్తి వినువీధికిఁ గైకొనిపోవ దీపపుం
బుట్టలవోలెఁ బైకెగిరి పోవుదురార్తిని మృత్యువీటికిన్. 80

ఉ. వంచనయంపుఁ బ్రేమయుఁ గృపాణమునందుఁ గృపారసంబు వ
ర్షించినరీతి యాసికతసీమఖజూరపుఁ దోఁటలుండి శో
భించును నచ్చటచ్చటుడుపీథిని జించియుఁ స్వర్గలక్ష్మి వి
క్షించుచునున్నదోయనఁగ జెప్పగచెప్పుచుఁ బాంథకోటికిన్. 81

ఉ. నీరములేని యాయిసుకనేల ఖజూరపుచెట్లు నిండి విం
డారు రసప్రపూర్ణతఖర్జూలకెల్ల సురాగమంబులై
పేరిమిఁగోర్కెలన్ దనుపఁ బేదకుఁ బెన్నిధివోలె నింపు సొం
పారఁ బథశ్రమప్రచయమార్చు నెడారిబిడారు కైవడిన్. 82

చం. దినములు పక్షముల్ నెలలు దివ్యశరత్తులు వచ్చిపోవుచు
న్నను జలదంబువచ్చి యొకనాఁడొక చిన్కునురాల్చి పోవదం
దినుఁడు నిరంకుశత్వమున నేలు సతంబును దద్వసుంధరన్
జనుటకుఁ జోటొసంగక ప్రజన్దెకమాడ్చుచు నుండుమ్రగుఁడై. 83

చం. జలధి సమీపమందెనసి జానపదంబులు నచ్చటచ్చటన్
వెలయు నివాసయోగ్యమయి భీషణదృశ్యము మాటునేయుతోఁ
టలును గుటీరపంక్తులు గుడారములున్ రచియించికాఁపురం
బుల నొనరింతు రచ్చ టరబుల్ తురగంబులు తోడునూఁపగన్. 84

తే. గీ. మెరకసస్యాలు ద్రాక్షఖజ్జూర ఫలాధి
వనవితానంబు బారుతీవలు జలావ
గాహనములై నచోట్ల ముక్కారుపంట
పండుచుండును సిరితాండవంబు సలుప. 85

ఉ. వారలలోనఁ బట్టణనివాసులు కొందలు పేరుపేరు వ్యా
పారము సేతురాంక్షికయు భారతదేశము పారసీకమున్
జేరి యనేకవస్తువులు చిత్రగతిన్గొని విక్రయించి వి
స్తార ధనంబుగూర్చి పరిమదంబునఁ బుత్తురు జీవితంబులన్. 86

ఉ. ఒంటెలమూఁపుపై సరకులొత్తుగఁబోసి యిజిప్టు సీరియా
తోంటిపలాసటీను బహుదూరపుదేశములేఁగి పాడియున్
బంటలునమ్మితెచ్చి తమవాసముఁజేరి నిజేచ్ఛనుండ్రు వె
న్నంటినవారి కుంకువగ న్యాయముగా సగపాలు పెట్టుచున్. 87

ఉ. పండ్లను జూలుగొట్టియలు వారువముల్ వసనాలు లొట్టెలన్
బండ్లను విక్రయించి విభవంబులు మౌక్తికతారహారముల్
కండ్లకుఁ గట్టినట్లుగ నఖండముగా గడియించితెత్తురా
యిండ్లరమావధూటి వివిధేప్సితరీతిని దాండవింపఁగన్. 88

సీ. ఖర్జూరమమ్మి ద్రాక్షలు కొనుచుందురు
ద్రాక్షలఁగొండ్రు ముత్యాలపేర్లు
ముత్యాలుపోసి సొమ్ములు గొనుచుందురు
సొమ్మిడికొండ్రు కస్తూరిపెట్లు
కస్తూరిపెట్టి బంగారము కొనుచుండ్రు
బంగారమిడికొండ్రు వస్త్రచయము
వస్త్రంబులిడి పెక్కువజ్రంబులను గొండ్రు
వజ్రాలనిడికొండ్రు వారువములు

తే. గీ. ఇట్లు లగరును జవ్వాది యెసకమెసఁగ
మాతులుంగ లవంగాది మలయజములు
ధాన్యములు గోధుమలు చాలధరలువెట్టి
కొనుచు నమ్ముచుఁ బోవుదు రనుదినంబు. 89

ఉ. మేకలు లొట్టెలశ్వములు మెండుగఁ గైకొని సంచరింతురా
సైకతసీమలన్ వివిధ జానపదంబుల నంతెకాని యో
ప్రాకటమైన నెన్నెలవుపట్టుమనన్ బదినాళ్ళ శాంతిమైఁ
జేకొనుచోటులేక తమజీవితముల్ ముగయింతురాదెనన్. 90

ఉ. వారలునిర్జనంబులు నపారము పామరుభూములందు సం
సారము సేయుచున్ బ్రతుకుసంపదనేరక సంచరించును
ద్వీరులు "బుద్దు" లం చచటఁ బిల్తురు నీతెగమోటు జాతులన్
బారముముట్టుచున్నది ప్రపంచచరిత్రమువింత గొల్పఁగన్. 91

ఉ. మాఱెను బెక్కురాజ్యములు మాఱెఁబ్రపంచచరిత్రనెన్నియో
మాఱులు భూమిపై ఖరులుమాఱెఁ గులంబులు సంఘజాలముల్
మాఱెనుగాని "బుద్దు" తెగమాఱఁగ లేదొకలేశమైన నీ
హారధరాధరంబు పవనాహతిఁ గ్రుంగిచలింపనట్లుగన్. 92

సీ. ఈ "బుద్దు" తెగ లాయరేబియా కాదిమ
వాసులై పేర్గాంచి వఱలుచుంద్రు
వీరు స్వాతంత్ర్య ప్రవీణాభిలాషులు
గిరిదరీద్వారాల దిరుగుచుంద్రు
దారిలేనట్టి యెడారుల నివసించి
కాలంబు వేడుకఁ గడపుచుంద్రు
మేమె మానవులము మేదినీప్రజ పశు
ప్రాయులటంచును బలుకుచుంద్రు

తే. గీ. ఘనకిరీటము తలపాగగాఁగఁ గోట
ఖడ్గము గృహంబుకృతకాద్రి కలితధృతి ప్ర
భుత్వశాసనములు మాకు మూఁడులోక
ములను నెందీడులేదని పలుకుచుంద్రు. 93

ఉ. వీరిపయిన్ బ్రభుత్వమున భీకరశాసనపంక్తి చెల్లఁగా
నేరదు మర్త్యకోటికడునీరసమైనదిగాఁ దలంత్రు శృం
గార వచోవిలాసముల గానముసేయుచు నాటలాడుచున్
బాఱు విహంగరీతిఁ దెగబాఱినటించెద రా ప్రదేశముల్. 94

ఉ. వీచెడువాయువట్లు వినువీథిని బాఱెడు పక్షులట్లు దోఁ
బూచులవాడు మత్స్యములఁ బోలె నెడారులఁ బట్టణంబులన్
రాచఱికంబు సేయుచు నిరంతరమున్ విహరించుచుండు రా
భూచరులున్ స్వతంత్రత ప్రబోధము సేయుదు రార్యులో యనన్. 95

ఆ. గీ. వీరు పెక్కు తెగల విభజింపఁబడి రేపు
మాపు జగడములను గోపతాప
రాగరోషములను గ్రాఁగుచుందురు ద్వేష
ఘోర దావదవముకులము లేర్చి. 96

వ. మఱియు 97

చం. అరబుల కెట్టినీతులును నాగమముల్ పృథుధర్మశాస్త్రముల్
వెలుపుదయింపఁజేయ వొకవీరుఁడు పెక్కు సరోజనేత్రలన్
బరిణయమాడు నొక్కఁడను బానిసలట్లు విడాకులిచ్చి కొం
దురుతును మాడుచుందురది దోసమునెంచర యోగ్యపద్ధతిన్. 98

ఉ. చౌర్యముచేత జీవనము సల్పుచునుందు రెడారులందు నై
శ్వర్యము గల్గువారు గనవచ్చినవారల దోఁచుకొంట నా
దార్యములన్ గణింతురు యథావిధి పొందులవాదరింపు చా
తుర్యముఁ జూపుచుందురట ద్రోహము సేయరు స్వష్టచిత్తులై. 99

వ. మఱియు 100

చం. అరబు లరణ్యముల్ గిరులయందు వసింపుచు సృష్టిచిత్ర సం
భరితరసానుభూతిమెయి భావములన్ దలపోసిపోసి వి
స్ఫురిత విలాపభాసురరసముజ్జ్వలకాంతివిశ్వ ప్రపంచమున్
తెరలెడు మేఘమాలికలతీరును జూచి నుతింతురీశ్వరున్. 101

శా. హంజాయొండె, మహమ్మదొండె, యుమరున్ హర్యక్షసంకాశు లై
పుంజీభూత రమావికాస విలసత్సంభావ ముస్లీమ్మహా
కంజాతాండమునిండు కొల్వగను మక్కాకాబముక్కారులన్
సంజాతప్రతిభావిభాసముల నిస్సాణంబు మోయింపఁగన్ 1059

కం. బెదరి ఖురేషులు దామిఁక
నెదురాడఁగలేక యుమరునేకమయి మహ
మ్మదుతో, గలిసెంగాయని
సదనములనుపీడి రతి విచారము తోడన్. 1060

— వైరుల నిర్వేదము; నిర్గమనము —

ఆ. గీ. ఎంతపంతగించి యెంతవారించిన
నంత యధికమయి యనంతలీల
హెచ్చిపోవుచుండె నిస్లాముమతములో
నేమి మహిమకలదొ యెఱుకపడదు. 1061

వ. మఱియు. 1062

సీ. అబిసీనియాపోయి హాయిగాఁదిరిగివ
చ్చినవారి నేమియుఁ జేయలేదు
అబుతాలబును దన యండకుఁ దిప్పుమ
హమ్మద్ ప్రవక్తఁగాదనఁగలేదు
హంజాఉమరులు మహాభక్తి అల్లాను
గొలుచుట మాన్పింపఁ గుదురలేదు
మక్కాను కాబాను ద్రొక్కరాదనియాంక్ష
చేసినవదియేమిచెల్లలేదు

ఆ. గీ. ఇంకమహామదీయ మేరీతి నరికట్టఁ
గలము గుడులను ప్రతిమలను నెట్లు
కావగలమటంచుఁ గలగుండువడి ఖురేష్
వర్గమెల్ల నేఁగె వగపుతోడ. 1063

## గద్య

ఇది శ్రీమహర్షి మొహిద్దీన్‌బాద్షాచానియాంబికా గర్భశుక్తి ముక్తా
ఫలాయమాన, సరసకవితాధురీణ. శ్రీఉమర్ ఆలీషాకవి
వరేణ్య విరచిత శ్రీమహమ్మద్ రసూలు ప్రవక్త
దివ్యచరిత్రంబునందుఁ ప్రథమ భాగము

స ం పూ ర్ణ ము



# "బ్రహ్మర్షి" డా॥ ఉమర్ ఆలీషా

## కవి కృతములు

1. శ్రీ మహమ్మదు రసూలువారి చరిత్ర
2. దానవధ
3. మహాభారత కౌరవరంగము (నాటకం)
4. సూఫీవేదాంతదర్శము
5. అనసూయ (నాటకం)
6. కళ
7. ప్రభాత కథావళి (కథలు)
8. విషాద సౌందర్యము
9. విచిత్ర బిల్హణీయము
10. బ్రహ్మవిద్యావిలాసము
11. స్వర్గమాత (కందార్థములు)
12. తత్త్వసందేశము
13. పరతత్త్వ కీర్తనములు
14. చంద్రగుప్త (నాటకం)
15. ఉమర్ ఖయ్యామ్
16. మణిమాల (నాటకం)
17. శాంత
18. ఖండకావ్యములు
19. బర్హిణీదేవి
20. పద్మావతి (నవల)
21. షాతత్త్వము
22. సాధనపథము



# SRI MOHAMMED RASULVARI CHARITRA

"BRAHMARSHI" Dr. UMAR ALISHA



SRI VISWA VIZNANA
VIDYA ADHYATMIKA PEETHAM

PITHAPURAM - 533 450.